పంపమహాకవి విక్రమార్జునవిజయమును, పంపభారతమును నామాలాగ్రముగ జదివి పెక్కుపట్టుల నాసంప్రదాయముల ననుసరించిన నన్నయభట్టారకుడు తన గద్యయందు, శబ్దశాసనుడు బిరుదమే యైనచో, దానిని తప్పక పేర్కొనియే యుండును. గద్యలుకూడ ప్రథమాశ్వాసమున నుండుటచేతనేగదా, బిరుదము లెన్ని చెప్పవలసియున్నను గద్య రానురాను పెద్దదిగ నున్నను, మనము కవి కాత్మస్తుతియను గుణము గలుగకుండ, చారిత్రకముగనుండ వాని నంగీకరించుటకు కారణమైనది. ప్రథమపురాణము 'మత్స్యపురాణావిష్కారాచార్యుడు' అనుచున్నట్టి 'శబ్దశాసన'విశేషణమును గద్యలో నట్టిది యున్నచో నాసంప్రదాయమును ననుసరించి పేర్కొనియే యుండును.

నన్నయ తరువాతి నన్నెచోడుడు, తిక్కన, కేతన, శ్రీనాథాదిమహాకవు లందఱును తమ బిరుదములను గద్యలలో చెప్పుకొనిరి. శ్రీనాథుడు తన కవిసార్వభౌమబిరుదము గద్యలో చెప్పినదాని సార్థకము కావున తెలుగునందే దాని నంతకుముందు కాలమునుండియు సంపాదించియున్న దానిని కాశీఖండమున గద్యలో జేర్చినాడు. అల్లసాని పెద్దన 'ఆంధ్రకవితాపితామహ' బిరుదముతో మనుచరిత్రగద్య ప్రారంభించినాడు. తెలుగున కొందఱు కవు లాబిరుదములతోనే వ్యవహరింపబడుచుండిరి. వారైన గద్యలలో నియతముగ జెప్పుకొనక తప్పరుగదా! అభినవదండి (కేతన), రాధామాధవ (చింతలపూడి యెల్లనకవి), ఆంధ్రకాళిదాసు (అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి) మొదలగువా రిట్టివారే. ఇప్పుడును కూడ శతాబ్దమున కూడ నీ ప్రాచీనసంప్రదాయము ననుసరించియున్న దనుటకు, ప్రాచీనసంప్రదాయానుసారముగ వ్రాయబడిన పద్యకావ్యములయం దన్నింటను కన్పట్టుచునే యున్నది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (కవిసార్వభౌమ)గారి భారతమున నిట్టి సంప్రదాయము కలదు. కావున శబ్దశాసనుడనునది బిరుదమే కాదని స్పష్టాంతము.

నన్నయకు కీబిరుద మున్నట్లు, నన్నయను పేర్కొన్న తిక్కన కేతనలు గాని, మంచనమారనలు గాని తెలుపలేదు. ఎఱ్ఱాప్రెగ్గడకూడ చెప్పలేదు. కొరవి గోపరాజు, పిడికి సింగన, పోతన మొదలగువా రెవ్వరును నన్నయ కీబిరుదము కలదని చెప్పలేదు. కవిత్రయమునారికే నన్నయ కీబిరుద మున్నదని తెలియనప్పు డిక తక్కినవారలగూర్చి తెలుపనక్కఱలేదు. పైవారిలో తిక్కన, మారన, ఎఱ్ఱాప్రెగ్గడ, గోపరాజులు నన్నయనుగూర్చి ప్రత్యేకముగా నొకపద్యమును చెప్పినారు. నలుగురైదుగురు కవుల గుఱిగూర్చి చెప్పునప్పు డొక్కొక్కవేళ బిరుదమును తెల్పుటకు వీలులేకపోవచ్చును గాని ప్రత్యేకపద్యమే చెప్పునప్పు డట్టి సందేహమున కవకాశమే లేదు. తిక్కన 'ఆంధ్రకవిత్వవిశారదు' డనియు, 'విద్యాదయితుడు' 'మహితాత్ముడు'అనియు నన్నయనుగూర్చి చెప్పినాడు.

మారన 'ఆంధ్రకవితాగురుడు'గా నన్నయను పేర్కొన్నాడు. ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయభట్టును కుంజరముతో బోల్చి, యాతని మాతంగగమనమును విశేషముగ బ్రశంసించినాడు. గోపరాజు "నా భావుకముని నన్నయభట్టుగ్" అని వ్రాసినాడు. వీరందఱిలో ముఖ్యు డెఱ్ఱాప్రెగ్గడ గదా! అరణ్యపర్వశేషము నన్నయ కవితారీతిరచన తోపించునట్లు రచించి, ఆశ్వాసాంతగద్యకూడ నన్నయపేర బెట్టిన గతమత్సరుడు, విశాలహృదయుడు నగు నెఱ్ఱాప్రెగడ తాను గుర్తించిన నన్నయను శబ్దశాసనుడని పేర్కొనకపోవుటయేకాక, ఆంధ్రకవితాసృష్టికి తిక్కన బ్రహ్మ యని పేర్కొన్నాడు. దీనినిబట్టి ఎఱ్ఱాప్రెగడకాలమువఱకు క్రీ. శ. 1350 ప్రాంతమువఱకు నిట్టి సంవాదమే లేదనుట నిస్సంశయము. క్రీ. శ. 1400 ప్రాంతమున విలసిల్లిన కొలని గణపతిదేవకవి శివయోగసారావతారికలో స్పష్టముగా 'నాంధ్రకావ్యపథము దీర్చిన నన్నయభట్టు గారిని ప్రశంసించినాడుగాని శబ్దశాసను డని ప్రశంసింపలేదు. నన్నయప్రసిద్ధి కవిత్వరచనముచే గాని వ్యాకరణరచనముచేత కాదని యిది తెలుపుచున్నది.

ఈ శబ్దశాసనపదము జక్కన, శ్రీనాథుడు మొదలగు నన్నయ గూర్చి ప్రస్తావించుటలో వాడినారు. జక్కన 'శబ్దశాసనవరేణ్యులు వాగనుశాసనుండు తిక్కకవి' అనియు, 'శబ్దశాసను నన్నపాచార్యవర్యు' అని శ్రీనాథుడును, నన్నయ తాను స్వయముగా వ్రాసికొనిన విశేషణముగానే యుపయోగించిరి. అందును శ్రీనాథుడు నన్నయభావను (సమాసములు, కారకములు) సహితముగా నన్నే యనుసరించెడువాడు. మఱియు తాను ప్రత్యేకముగ నన్నయనుగూర్చి వ్రాసిన పద్యములో నన్నయభట్టోపాధ్యాయు నని మాత్రమే పేర్కొనినాడు. అనగా శ్రీనాథుని కాలమున నిది యొక బిరుదముగా కవివ్యవహారములో లేదు. అతనినాటి కవులుగూడ నన్నయనుగూర్చి చెప్పునప్పుడు శబ్దశాసనపదమునే యుపయోగించిరి. 'శబ్దశాసనకావ్యసంఘటనక్రమాసంజితబుధసభ్యు నన్నపార్యు'నని ఆంధ్రకవి రామయ్య (విష్ణుకాంచీమాహాత్మ్యము). కాగా క్రీ. శ. 1500 ప్రాంతమువఱకు నన్నయ కిది బిరుదముగా కవు లెవ్వరును పేర్కొనలేదు. కాబట్టి బిరుదమే లేనప్పు డాబిరుదము వచ్చుటకు కారణభూతమగు గ్రంథమును రచించెనని చెప్పుట యాకాశహర్మ్యమువంటిది గదా!

క్రీ. శ. 1500 లకు దరువాత శ్రీకృష్ణదేవరాయని కాలమున గల కవులు నన్నయను పేర్కొన్నారుగాని బిరుదప్రస్తావనము చేసే లేదు. ఈకాలమువాడే యని చెప్పదగిన కాకమాని గంగాధరుడు అను కవి తన బాలభారతములో "శబ్దార్థరసవిశారదు, శాబ్దికపూర్వార్థ్యు, శబ్దశాసనబిరుదుగ్, శబ్దాయమానవిస్ఫురదబ్ధఘటారభటి నన్నపార్యు దలంతుగ్" అని పేర్కొనినాడు. ఈతడావఱకు గల కవిస్తుతులలోని విశేషణప్రయోగము బిరుదముగా భావించి యిట్లు స్తుతియించియుండును. లేక బిరుదు అనగా మొనగాడు, సమర్థుడు అని యర్థము చేసికొనవచ్చును.

ఇది నిశ్చితము గాలేదుగాని, యిందున్న శబ్దశాసనపదమును మాత్రము మనము దృష్టియం దుంచుకొనవలెను. ఇది నన్నయనుండి పరంపరాగతముగ వచ్చుచున్న దనియు, నదియే బిరుదవాచకముగ

తరువాత నొక సంప్రదాయ మేర్పడెననియు గ్రహింపనగును. ఇది ముందు చెప్పబోవు విషయమునకు జాల ముఖ్యమైనది.

క్రీ. శ. 1570 ప్రాంతమున రామరాజభూషణుడు వసుచరిత్ర రచించి శ్లేషలో "మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుడు ప్రోవన్ మహామహులై సోముడు భాస్కరుండు నెలయింపన్ సొంపు వాటిల్లు నీబహుళాంధ్రోక్తిమయప్రపంచమును" ప్రశంసించినాడు. వాగనుశాసను డను పేరు శబ్దశాసనుడుగా మాఱుటకు నిదియే మొదలు. ఇంతకుముందు నన్నయను శబ్దశాసను డనియే పేర్కొంటి రని చూపితిని. రామరాజభూషణుని వసుచరిత్రము తరువాతి ప్రబంధరచయితల కుపజీవ్యమై ఆదర్శప్రాయ మగుటచే నిదియే ప్రమాణముగ గొని వాగనుశాసనుడని వారు పేర్కొన జొచ్చిరి. అప్పటినుండి, యనగా క్రీ. శ. 1600 ప్రాంతములనుండి వాగనుశాసనుడనునది వాడుక యయ్యెను. అది యొక బిరుదముగా నన్నయ కారోపితమయ్యెను.

వాస్తవికస్థితి యిట్లు చారిత్రకముగ నిరూపిత మగుచుండ 'ఆంధ్రశబ్దచింతామణి' యను సంస్కృతభాషామయాంధ్రవ్యాకరణము వాగనుశాసనుడైన నన్నయభట్టవిరచితమనియు, వాగనుశాసన, శబ్దశాసనపదములు పర్యాయపదములే కావున భారతము రచించిన నన్నయభట్టే దీనిని రచియించె ననియు, నాంతరంగబహిరంగప్రమాణములచే నాంధ్రచింతామణి, భారతము లేకకర్తృకము లనియు నింకను కొందఱు విద్వాంసులు వాదించుచున్నారు.

ఆంతరంగికప్రమాణము లట్లుండగా, బహిరంగప్రమాణములచేతనే తొలుత నీ వాదము ధ్వస్తమగుచున్నది. వాఙ్మయప్రపంచమునందే క్రీ. శ. 1570 ప్రాంతములకు ముందు వాగనుశాసనపదమే లేదని విస్పష్టముగ నిరూపితమైనది. నన్నయ వాగనుశాసను డని పేర్కొనకబడక పోవుటచేతను, నింతవఱకు వ్యాప్తిలో నున్న శబ్దశాసనపద మాంధ్రశబ్దచింతామణిలో లేకపోవుటచేతను, వాగనుశాసను డని నన్నయ పేర్కొనబడినతరువాతనే ఈగ్రంథము పుట్టినదని నిస్సంశయముగ జెప్పనగును. మఱియు శబ్దశాసనవాగనుశాసనపదములు పర్యాయపదములే గనుక భారతమున నట్లు చెప్పకపోయినను, నన్నయచింతామణియందు చెప్పుకొనె నని యొక యుపపత్తి చెప్పుదురు. కాని యివి రెండును బిరుదములని వా రంగీకరించునప్పుడు, బిరుదములకు పర్యాయపదములు ప్రయోగింతురని వా రంగీకరించిరో నింక, వారికి తెలుగుభాషాసంప్రదాయమే తెలియదని చెప్పదగును. బిరుదములు రూఢి యగుటచే, నవి యే భాషాపదములైనను నట్లే యుపయోగింపవలెనని నియమము. తుదకు శుద్ధాంధ్రకావ్యమగు యయాతిచరిత్రమున పెక్కు తత్సమములను పచ్చతెలుగుగా మార్చియు బిరుదులనుమాత్ర మట్లే వాడినాడు. 'లంలసరిగజాంకుశ' మున్నగునవి యుదాహృతులు. ఇది తెలుగుభాషాసంప్రదాయము ననుసరించినది. శబ్దశాసనుని వాగనుశాసను డన్నచో, శంభుదాసును శంకరదా సనియు, శశిభూషణదా సనియు, ఉభయకవిమిత్రుని ద్విభాషాకవిమిత్రు డనియు, కవిసార్వభౌముని కవిరాజరాజేశ్వరు డనియు నన్న నెంత సమంజసమో నదియు నంత సమంజసమే. వేయేల? పితామహు డనగా బ్రహ్మయేగదా! ఆంధ్రకవితాపితామహు డను నల్లసాని పెద్దన్నను ఆంధ్రకవితాబ్రహ్మయని యేల పర్యాయపదముగా పేర్కొనలేదో? కావున నిదియును వాగనుశాసనుని పేర తరువాత నారోపితమైన రచనమే కాని శబ్దశాసనుడగు నన్నయ కేమాత్రము సంబంధము లేదని ధ్రువపఱచుచున్నది.

నన్నయకు వెనుక నాల్గువందల యేండ్లవఱకు శబ్దశాసనప్రశంస లేకపోగా, నావెనుకనైన నది బిరుదము కాకపోగా, నావెనుక కాలమున కవిసృష్టిచే నారోపితమైన వాగనుశాసనశబ్దమును, భారతాంధ్రీకరణకర్తయైన నన్నయకే బిరుదమని తలంచి, అది యాధారముగా నాంధ్రశబ్దచింతామణి నన్నయదే యని యంగీకరించి, అందలి విషయములను, విశ్వశ్రేయః కావ్య మిత్యాది వాక్యములను ప్రమాణీకరించి, సారస్వతవిమర్శనము గావించువారి విచక్షణ యేపాటిదో, ప్రాజ్ఞు లాలోచింతురుగాక!

వాగనుశాసనశబ్దప్రయోగముచేగాక, ఆంధ్రశబ్దచింతామణి ప్రాచీనలక్షణికు లెవ్వరిచేతను స్పృశింపబడక పోవుటయు, బాలసరస్వతి యప్పకవికాలమువఱకును (ఇరువురును సమకాలికులే!) అనగా క్రీ. శ. 1656 వఱకు, ననగా 6 వందల యేండ్లవఱకు నీపేరే వాఙ్మయప్రపంచమున వినరాకపోవుటయు ఇది కూటసృష్టి యని నిరూపించుచున్నది. అసలు వాగనుశాసనుడే నన్నయ కానప్పుడిక నాంధ్రశబ్దచింతామణి రచన మెట్లు?

పైని వివరించిన విషయములు చారిత్రకక్రమము ననుసరించినవి. నన్నయకు శబ్దశాసనుడని బిరుదము కాదనియు, నావెనుకనైగు శతాబ్దములవెనుక నాతని కారోపింపబడినది యనియు, బిరుదులకు పర్యాయపదము లుండవనియు, నందుచేత నాంధ్రశబ్దచింతామణి భారతాంధ్రీకరణకర్తయైన నన్నయ రచింపలేదనియు సిద్ధాంతము.

నన్నయ మహాభారతమున రాజరాజును గూర్చి తెలిపిన విషయములు—

1. రాజరాజుకులగోత్రములు:—

రాజకులాగ్రగణ్య. (1-161) మానవ్యసగోత్ర - (5-260)
రాజకులశేఖర (2-283) (5-261)
శ్రీమచ్చళుక్యవంశశిఖామణి (3-1)
చళుక్యాన్వయపయోధిసంపూర్ణశశి (4-1)
సత్యాశ్రయకులశేఖర (4-272)
రాజాన్వయతిలక (6-1)
చళుక్యకులతిలక (6-308)
శీతాంశువంశప్రకాశ (6-308)
రాజకులదీప (7-288).

రాజవంశరత్న (అర 1-40)
రాజకులోత్తమ (1-294)
రాజవంశ వార్ధిచంద్ర (2-421)
భూపకులతిలక (అర 3-398)

2. తండ్రి పేరు—విమలాదిత్యాగ్రతనూజ (4-272) విమలాదిత్యాత్మజ (1-11)

3. మతము : ఆచారము—
మృడప్రియ (1-161) మనుమార్గ (3-1) మహాదానతర్పితద్విజవర (5-1) వ్యసనవివర్జిత (5-260) దక్షిణముఖాంకిదయాలబ్ధసుస్థిరైశ్వర్యపదా (7-1) భీమేశ్వరకృతనిత్యప్రసాద (అర 1-399)

4. శౌర్యము—పరగండభైరవ (ఆ. 3-277) (స. 2-219) (అ. 1-398).
పరగండభేరుండక (ఆ. 2-355)
వైరివీరరసవైద్య—(స. 2-219)
వైరి వీరభయంకరశౌర్య (అ. 8-322)
నృపపూజిత పదాంభోజ (7-288)

కులక్రమాగతముగా వచ్చినవి—
సమస్తభువనాశ్రయ. (అ. 4-273) (2-355)
పరాక్రమరాఘవ (స. 1-292)
నిరవద్య (5-261) (1-163)

## మ హా భా ర త ము

1847. ఆదిపర్వము—వచనముతో స హా, వైయాకరణము రామానుజాచార్యులవారిచేతను, పరవస్తు చిన్నయ్య సూరిచేతను ముద్రితమైనది. వచనరచయిత రామానుజాచార్యులు. 313 పుటలు—(ఫూల్ స్కే_పు)

1853. సంపూర్ణముగ 18 పర్వములు ముద్రితములైనవి.

శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీసకలభాషావాగనుశాసనబిరుదాభిరామ శ్రీమన్నన్నయభట్టారకకవిసార్వభౌమప్రముఖసత్కవిప్రణీతంబును నిఖిలపరమపురుషార్థసాధకంబును కలికల్మషధ్వంసకంబును పంచమవేదంబును యెల్లవిద్వజ్జనంబులకు నత్యంతం బాదరణీయంబగు నాంధ్రభారతమహాకావ్యంబు చెన్నపురంబునం గాంచీపురము పచ్చయప్పమొదలారిగారి విద్యాశాలయందు సంస్కృతాంధ్రభాషాద్వితీయోపాధ్యాయులును వాణీమండపంబగు చెన్నపట్టణము హిందూబాలురసంస్కృతాంధ్రద్రవిడ పాఠశాలయందు బండితాధ్యక్షులు నగు—కోరాలపాటి రంగయ్యగారిచే లేఖకదోషంబులు లేకుండునట్లు పరిష్కరింపబడి, విళందుడ సోమసుందరపిళ్లగారిచే పా. కుమారయ్యగారి కళానిధి ముద్రాక్షరశాలయం దచ్చొత్తింపబడి ప్రకశాలివాహనశకాబ్దంబుల 1775 యగు పరీధావినామ సంవత్సర మార్గశీర్ష పూర్ణిమయందు బర్యాప్తం బయ్యె.

విశ్వవిశ్వంభరావినుతమహైశ్వర్య
ధుర్యు డౌదార్యసంతోషితార్య
వర్యుండు శివకామవల్లీవధూటీమ
తల్లీ సమాశ్లేషతత్పరుండు
నిర్వ్యాజకారుణ్యనిమ్నగాధీశని
మజ్జన్నమజ్జనమండలుండు
మహనీయతపనీయమణిమయప్రాకార
గోపురాగారసందీపితుండు
హితవిధానుండు వృద్ధాచలేశ్వరుండు
మెచ్చి నిచ్చలు దన కోర్కె లిచ్చుచుండ
నెసగ నిరుపమసంపద నెవ్వ డట్టి
ఘనుడు ముత్తియపిళ్లయ స్థనికవరుడు.

కూరిమి దేవేరి యనం
గా రహి నెల్లెడల బొగడు గాంచిన మీనా
క్షీరమణీమణియందుగ
సూరిప్రియుడయిన సోమసుందరు గనియెన్.

జగదభివందనీయమతిశాలి విళందుడసోమసుందరుం
డగతనయానురాగలలితాత్మ్యవిహీనవిభూషణుం డనం
తగుణసమగ్రభావధరధర్ముడు పుణ్యజనప్రియుండు ధీ
రగణయుతుండు శూలి క్రియ రాజిలువా డత డింపుమీరగన్.

విశ్వజనీనంబువివిధమనోరథ
సిద్ధిప్రదంబు నశేషదోష
నిర్వారణము వర్ణనీయము శబ్దాను
శాసనతిక్కనశంభుదాస
రచితంబు నైన భారతమహాకావ్యంబు
సత్కవిప్రకరంబు సన్నుతింప
లేఖకదోషము ల్లేక తద్దయు బరి
ష్కృతమయి యొప్పరికింప జేసె,
ఖిలము లయ్యెడు దేవనికేతనప్ర
పోపవనదీర్ఘికాదుల నుద్ధరించు
పగిది లోకైకహితకాంక్ష దగిలి యెలమి
మిగుల ముద్రాక్షరాంకితముగ నొనర్చె.

విరాటపర్వాంతమున పద్యము—
"తిక్కనసోమయాజి జగతీనుతసద్గుణరాజి సత్కవుల్
పెక్కువిధంబులం దనదు పేర్మి నుతింప మనోహరం
బెక్కుడు పేర్కొ దొల్లి రచియించిన భారతమందు
పెక్కె విరాటపర్వ మిది యెల్లెడ నిచ్చలు—

ఉద్యోగపర్వాంతమున పద్యము—

"పొదలం జేయు ముదంబు సత్కవుల కెప్డున్ సాధుశబ్దార్థసం
పద దెంపారి యశేషదోషముల మాన్పం జాలి నానారసా
భ్యుదయోల్లాసము పేర్మి గల్గి మహిం నీ యుద్యోగపర్వంబు దో
షదమం గూర్చుచు గద్యపద్యముల హృద్యంబై కరం బొల్చెడిన్."

పు ట లు

| | |
|---|---|
| ఆదిసభా... | 155 |
| అరణ్య... | 158 |
| విరాట... | 75 |
| ఉద్యోగ... | 74 |
| భీష్మ | 56 |
| ద్రోణ... | 97 |
| కర్ణ... | 60 |
| శల్య... | 47 |
| సౌప్తిక... | 22 |
| స్త్రీ... | 20 |
| శాంతి... | 138 |
| అనుశాసనిక... | 95 |
| అశ్వమేధ... | 50 |
| ఆశ్రమవాస మౌ. | 45 |
| | 1092 |

(12 పుటలు విషయానుక్రమణిక)

ముద్రణము ముగిసినవెనుక నున్న పద్యములు—

"శ్రీకరమఖిలార్థసిద్ధిప్రదము కవి
త్రయరచితంబు సత్కవినుతంబు
పంచమవేదంబు పరమేతిహాసంబు
భవ్యంబు శ్రీమహాభారతంబు
లేఖకదోషావళీరహితంబుగా
రసికు లింపొంద గరాలపాటి
రంగయాహ్వాయకవిపుంగవుం డొనరింప
శాలివాహశకాబ్దసమితియందు
సాగరర్షి ధరాధరచంద్రసంఖ్య
సన బహుధావిహాయనమున ననంత
మణి.శరాసనమున నుండ మార్గశీర్ష
దగు
నల్లే మాసపూర్ణిమ లోకైక భాసురముగ.
మగు యయాతుద్ధారవైభవవిధాయి విళిందుళసోమసుందరా
మార్చియు బిరుదులగణ్యుడు మహామతిశాలి యొనర్చి విస్ఫుర
మున్నగునవి యుదాస్య శానన గళానిధి నా గర ముల్లసిల్లు ము
ననుసరించినది. శబ్దశాసుందు విశదాక్షరముద్రితమై వెలుంగగన్."

నారాయణభట్టు (క్రీ. శ. 1053)

నారాయణభట్టు నన్నయసమకాలికుడని, సహాధ్యాయుడని యీక్రింది భారతపద్యమువలన తెలియుచున్నది :

(ఆది. 1-24)

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబు నందు నా
రాయణునట్లు వానసకరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడున్ తన కిష్టుడున్ సహా
ధ్యాయుడు నైనవా డభిమతంబుగ దోడయి నిర్వహింపగన్."

ఈపద్యము పెక్కు భారతప్రతులయందు కన్పట్టకున్నను క్రీ. శ. 1656 సంవత్సరమున నప్పకవి తాను రచియించిన అప్పకవీయములో నిత్యసమాసవిశ్రాంతులలో నారాయణశబ్దమున కుదాహరణముగా నిచ్చియున్నాడు (3-170). కాబట్టి యప్పకవికి ముందు భారతప్రతులలో నిది యుండియుండవలెను. కాని నేడు మన కప్పకవికాలము కంటె ముందు వ్రాయబడిన భారతప్రతులు లభింపవు. కాబట్టి యీవిషయమై యిదమిత్థమని చెప్పజాలము. అప్పకవి నన్నయభట్టారకభారతభాగమునుండి యుదాహరించిన పద్యముల లోని పాఠములు నన్నయనాటి భాషాసంప్రదాయములకు విరుద్ధములుగ నుండుటయే గాక, ఆతని కవిత్వతత్త్వమును మఱుగుపఱచునవిగా యున్నవి. అప్పకవికన్న ముందున్న లాక్షణికులలో ముద్దరాజు రామన 'కవిసంజీవని'లో భారతములోనుండియే మూడువంతులకు పైగా ప్రయోగములను గ్రహించియున్నాడు. అందీపద్యముదాహరింపబడి యుండలేదు. నారాయణభట్టును తెలుగుకవు లెవ్వరును స్తుతించి యుండలేదు. అప్పకవి యీపద్యము నుదాహరించుటయేకాక, ఆంధ్రశబ్దచింతామణినికూడ నీతని సహాయముచే రచియించె నని గ్రంథావతారికలో నిట్లు చెప్పియున్నాడు :

"మును నారాయణధీరుడు
తనకు సహాయుడుగ సంస్కృతము వాగనుశా
సనుడు రచియించె దానిం
దెనిగింపగ నీకు దోడు నే నిపు డగుదున్."

అప్పకవి యిట్లు వ్రాయుటచేత, పైపద్యము నన్నయ వ్రాసియుండునా, లేక యప్పకవియే, ఆంధ్రశబ్దచింతామణీకర్తృత్వము నన్నయకు స్థిరపఱచుటకు నీపద్యమును సృష్టించెనా యని యనుమానము దృఢమగుచున్నది. నేడే యాంధ్రశబ్దచింతామణీప్రతియందును గన్పట్టని నారాయణభట్టసహాయవిషయ మప్పకవి యెట్లు వ్రాయగలిగెనో దురూహ్యము. ఈపద్యమున యతివిషయముగూడ సందేహాస్పదమే. అప్పకవి యుదాహరించిన నిత్యసమాసయతులకు నన్నయ భారతమున నుదాహరణములు లేవు. ఇట్టి సమస్యలన్నియును నన్నయభట్టరచితభారతభాగమునకేని సప్రమాణమును, శాస్త్రీయమును, సంప్రదాయసిద్ధమును నగు పరిష్కరణము లేకపోవుటచే బయలుదేరినవి. అప్పకవీయరచనముతరువాత నా గ్రంథమే ప్రమాణమగుట

ప్రకృత్యా య ద్వక్రం తదపి సమరేఖం నయనయోః
న మే దూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్"

అనినాడు. దీనిలో శకుంతలావృత్తాంతమంతయు నిగూఢముగా దాగియున్నది. ప్రారంభమున ఈషణ్మాత్రమైన కథావస్తువు క్రమక్రమముగా విపులమైనది. మృగయావినోదమున వచ్చిన రాజునకు పుత్రత్వము కలుగుటయే కథావస్తువు. మార్గమధ్యమున దుర్వాసశాపమున నిది విచ్ఛిన్నమై చివరకు సమన్వయమందినది. శమవిరోధియగు వికారము కల్గుటచే వక్రమైన చరిత ధర్మనిష్ఠమైనది. ఈరీతిగా ఏకానుభూతిలో రాబోవు వృత్తాంతమంతయు కథాభావనద్వారా దర్శింపబడుటయే మహాకవులలో కన్పించును. ఈవర్ణనలో వివిధవాచ్యవాచక, వ్యంగ్యవ్యంజకరచన అంతర్లీనము. మహత్తరము, అతిగభీరము నైన ఈ అనుభూతిని శబ్దము కేవలము ధ్వనించును. అనగా శబ్దము ఎల్లపుడును ఉపహితమై, అనుపహితస్ఫూర్తికి త్రోవ జూపును. కావుననే—

"ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః
తదుపాయతయా తద్వ దర్థే వాచ్యే తదాశ్రయః."

అనినాడు ఆనందవర్ధనుడు. దీపముద్వారా వస్తువులను చీకటిలో చూపగలము. వస్తువులు వెలుతురులోకూడ కన్పించక పోయినచో నీవెలుతురు నిష్ప్రయోజనమే. అదేవిధముగా సమగ్రానుభూతిని గలుగజేయని శబ్దార్థములవలన ప్రయోజనము లేదు. కావ్యములో దరూపమున, వాక్యరూపమున అనేకభావము లున్నవి. కాని చివరకు సహృదయునకు కలుగు అనుభూతి వీనికన్న విశిష్టము, విలక్షణముకూడ. కాగా శబ్దార్థముల కతీతమైన మహాకావ్యము, శబ్దార్థముల ద్వారా అభివ్యక్త మగుచున్నది.

అలంకారాదులు వాచ్యార్థమునకు చెందినవి. ఈ వాచ్యార్థముకన్న విలక్షణమైనదే ధ్వని. అదే నిజమైన కవిత. అనేకాలంకరణశోభితయైనను ఒక స్త్రీ లావణ్యవతి కాకపోవచ్చును; అలంకారశూన్యయైనను శకుంతలవలె లావణ్యామృత చంద్రిక కావచ్చును. ఇట్లే గుణాలంకారాదులు కావ్యసౌందర్యమునకు అభివ్యంజకములు కాలేవు. కాని అంతమాత్రముచే వాచ్యార్థము సుతరాం పనికిరాదనరాదు. వ్యంగ్యార్థము వాచ్యార్థము నాశ్రయించుకొనియే ఉండును. అనగా వ్యంగ్యార్థమున వాచ్యార్థము తిరస్కరింపబడుట లేదు. పైగా వ్యంగ్యమున అంతర్లీనమై, వ్యంగ్యరూపమున అర్థము సమగ్రము, సంపూర్ణము నగుచున్నది. ఏతంవిధమైన ప్రతీయమానార్థమే ధ్వని.

కావున ధ్వనియనగా ప్రతీయమానమగు అర్థప్రతిస్ఫూర్తి. ఈ స్ఫురణలో జ్ఞానాత్మకమైన అనుభూతి కలదు. అందుచే జ్ఞానమే ధ్వనిలక్షణ మని అభినవగుప్తపాదు లనినారు. ఈ జ్ఞానము పూర్వానుభూతులనేగాక భవిష్యత్కాలీనానుభూతులనుకూడ సమన్వయపరచునది. అనగా నీ జ్ఞానాకారమగు ధ్వని త్రైకాలికాబాధ్యమగు అనుభూతి లేక అవగతి అగుచున్నది. కావుననే కావ్యప్రతీతి దేశకాలములచే అనియంత్రిత మగుచున్నది. కాగా సహృదయునకు ఉత్తమకావ్యమువలన కలుగు ప్రతీతిని, లేక అనుభూతిని ధ్వనిఅనవలెను. ఇట్లే మహాకవియొక్క దివ్యానుభూతికూడ ధ్వని అనిపించుకొనును. దీనినే శాంతరసప్రతీతి అనికూడ అందురు.



# చెరలో

శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు

<u>లోపల :</u>

నిరుడు విరిసిన నీల గగనం
నేడు కనపడదమ్మా
నిరుడు విసరిన శీతవాయువు
నేడు మసలదు తల్లీ !

నీలి రెక్కల కాలవిహగం
నీడ జిక్కితి తల్లీ
జాలి కన్నుల కారు చీకటి
ముందు నిలచితి నమ్మా!

ఖంగుమన్నవి మృత్యుదేవత
కాలియందెలు తల్లీ
చరమ రాత్రించరుల సన్నిధి
జలదరించితి నమ్మా !

కలల బ్రతుకున గాలిమేడలు
కరగిపోయిన వమ్మా
వెలితి కన్నుల వెలుగుకోసము
వెదకికొందును తల్లీ !

స్వేచ్ఛ కోరిన పేదరక్తము
వెల్లువారిన దమ్మా
జనసమరమున పరాజితుడను
సెల వొసంగుము తల్లీ !

ద్వేషబుద్ధిని ధిక్కరిస్తే
దోష మెవరిది తల్లీ
తీరు లేనిది నేటి లోకం
నేర మెవ్వరి దమ్మా ?

<u>బయట :</u>

ఎవ్వ రక్కడ
పాడేది యింతరాత్రి ?
నిద్రపోతోంది
పాపం, దరిద్రధాత్రి !

ఓ, దగాపడ్డ
జనులార ! ఉరికి వెరచి
గాయపడిన
గుండెల్లార ! కళ్లు తెరచి
బతుకు తెల్లలు
వెదకండి ! చితుల వెనక
నిత్యచైతన్య
రాగ ముందేమొ ? కనక
లాభ మే ముంది
మీ తుది క్షోభవలన ?
మీ కోరకు త
పిస్తున్నది మృత్యులలన !
మలుపు తిరగని
బాటల కళవళించు
పలితదీపాలు
మిమ్మల్ని పలుకరించు
చివరి గడియల
కష్టాన్ని జీర్ణదీప్తి
లోన గడపండి,
దీర్ఘనిద్రానవాప్తి !

('చెరకాలం' మహాకావ్యం నుంచి)